

# విషయసూచిక




కాలసర్ప దోషం ........................................ 7
ముఖ్యమైన కాలసర్ప దోషాలు................................ 10
కాలసర్ప దోషం వలన వచ్చే ప్రధానమైన సమస్యలు .......... 16
నిత్యం పఠించవలసిన సర్పశ్లోకం............................ 23
కాలసర్ప దోషం పుత్ర సంతానము ............................ 24
కాల సర్ప దోషాలకు శ్రీ మహా మృత్యుంజయ మంత్రము ద్వారా పరిహారము. 28

1. అనంత కాల సర్ప దోషము ........................... 30
2. కుళిక/గుళిక కాలసర్ప దోషము......................... 33
3. వాసుకి కాల సర్ప దోషము ........................... 35
4. శంకుపాల కాల సర్ప దోషము.......................... 38
5. పద్మ కాల సర్ప దోషము .............................. 40
6. మహాపద్మ కాల సర్ప దోషము ......................... 43
7. తక్షక కాల సర్ప దోషము.............................. 45
8. కర్కోటక కాల సర్ప దోషము........................... 48
9. శంకచూడ కాల సర్ప దోషము .......................... 51
10. పాతక కాల సర్ప దోషము ........................... 53
11. విశిధర కాల సర్ప దోషము .......................... 56
12. శేషనాగ కాల సర్ప దోషము .......................... 58

కాలసర్ప దోషము వివిధ పరిష్కార మార్గాలు .................. 62
సంతాన యోగములు ........................................ 71
సర్ప గాయత్రి .............................................. 73
సంతానబలం కలిగిన గ్రహ పొంతనలు ........................ 74




జ్యోతిషంలో అతి వివాదాస్పద విషయాలలో కాల సర్ప యోగం ఒకటి. కాల అనగా కాలము అని అర్థము. సర్ప అనగా పాము అని అర్థము. కాలసర్ప అనగా కాలము సర్పముగా మారి జాతకుడిని అనేక రకాల కష్టాలు పాలు చేయటమే కాలసర్పయోగము లేదా కాలసర్ప దోషము అని అంటారు. కాలసర్పదోషం జాతకంలో రాహు కేతువుల వలన ఏర్పడుతుంది. మానవ జాతకంలోని జన్మ కుండలిలో రాహు కేతువుల మధ్య మిగిలిన అన్ని గ్రహాలు వస్తే దానిని 'కాలసర్ప యోగం' అంటారు. అంటే రాహు కేతువుల మధ్యలో మిగిలిన రవి, చంద్ర, కుజ, గురు, శుక్ర, శని గ్రహాలు ఒక పక్కన వుండి మరొక పక్కన అసలు గ్రహాలు లేకుండా ఉండడం. ఆ సమయంలో జన్మించిన వారికే మాత్రమే కాలసర్ప దోషం వస్తుంది. జాతకచక్రంలో రాహువు గాని కేతువు గాని 1, 2, 5, 7, 8 స్థానాలలో ఉండి ఎటువంటి శుభగ్రహ

దీర్ఘకాలిక వ్యాధులు ఏర్పడుట, చికిత్స విఫలమై మరణించుట.

మొండిగా వ్యవహరించుట, శత్రువు వలన మృతి చెందుట.

మానసిక ప్రశాంత లేక పోవుట, ప్రమాదాలు, అవమానాలు.

సర్ప దోషాల వలన అనేక కుటుంబ, ఉద్యోగ, వ్యాపార సమస్యలుండుట.

## నిత్యం పఠించవలసిన సర్పశ్లోకం



ఈ శ్లోకం ప్రతిరోజు సాయంకాల సమయంలో పఠించదగ్గది. ప్రాతః కాలంలో పఠించినచో ఎక్కువ విశేషం. ఈ శ్లోకాన్ని నిత్యం పఠించే వారికి సర్పముల వలనకానీ, విషము వలన కానీ భయం ఉండదని, అన్నింటా విజయమే లభిస్తుందని అంటారు.

అనంతం వాసుకిమ్ శేషం పద్మనాభంచ కంబళం ।
శంఖపాలం ధృతరాష్ట్రం తక్షకమ్ కాళీయం తథా ॥
ఏతాని నవనామాని నాగానాంచ మహాత్మనాం ।
సాయంకాలే పఠేనిత్యం ప్రాతఃకాలే విశేషతః ।
తస్య విషభయం నాస్తి సర్వత్రవిజయీ భవేత్ ॥

# కాలసర్ప దోషం
# పుత్ర సంతానము



**పుత్రస్థానగతే రాహో కుజేన చ నిరీక్షతే**

**కుజక్షేత్రగతేవాపి సర్పశాపాత్సు తక్షయ:**

**పుత్రేశే రాహు సంయుక్తే పుత్రస్థే భానునందనే**

**చంద్రేక్షితయుతేవాపి సర్పశాపాత్సు తక్షయ:**

**కారకే రాహుసంయుక్తే పుత్రేశే బలవర్జితే**

**లగ్నాధిపే సభౌమేపి సర్పశాపాత్సుతక్షయ:**

(బృహత్పరాశర హోరాశాస్త్రం)

పంచమాధిపతి రాహువుతో కూడియున్నా, శని పంచమమందున్నా, చంద్రునితో కూడినా, చూడబడినా సర్పశాపము. పుత్రకారకుడైన గురువు రాహువుతో కలసియున్నా, పంచమాధిపతి దుర్బలుడైనా, లగ్నాధిపతి కుజునితో కలసి యున్నా సర్పశాపము అని చెబుతారు. దీనివల్ల సంతాన సమస్య అని చెబుతారు.






వివిధ కాల సర్ప దోషాలకు శ్రీ మహా మృత్యుంజయ మంత్రము ద్వారా పరిహారములు చేయవచ్చును.

జాతక కుండలిలో రాహు మరియు కేతు గ్రహాల మధ్య మిగతా అన్ని గ్రహాలు బంధించబడి ఉంటె ఆ స్థితిని కాలసర్ప దోషము లేదా సర్ప దోషము అంటారు. దీనివల్ల రాహు కేతువులు మిగతా గ్రహాల శుభ ఫలితాలని రాకుండా ఆపి వేస్తారు.

## వివిధ రకాల సర్పదోషాలు

1. రాహు 1వ స్థానములో ఉండి కేతు 7వ స్థానములో ఉంటె అది అనంత కాల సర్ప దోషము.

## శ్రీ మహా మృత్యుంజయ మంత్రం

ఓం హౌం ఓం జూం సః భూర్భువః స్వః త్రయంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనం ఉర్వారుకమివ బందనాన్ మృత్యోర్ముక్షీయ మామృతాత్ స్వః రోం భూర్భువః జూం సః హౌం ఓం

## 6. మహాపద్మ కాల సర్ప దోషము




రాహు 6 వ స్థానములో ఉండి కేతు 12 వ స్థానములో ఉంటె అది మహాపద్మ కాల సర్ప దోషము. ఈ దోషము గల జాతకుడు శత్రువుల నుండి తీవ్రమైన సమస్యలు కలిగి ఉంటాడు వీరికి చాలామంది శక్తివంతమైన శత్రువులు ఉంటారు, వీరు వీరి శత్రువులను అదుపు చేయలేక పోతారు, వారిని ప్రత్యక్షంగా కానీ పరోక్షంగా కానీ ఎదుర్కోలేకపోతారు, శత్రువులు వల్ల వీరు చాల నష్టపోవలసి వస్తుంది. ఎప్పుడు ఎదో ఒక వ్యాధితో బాధపడేఅవకాశం ఉంది. ఆరోగ్యంగా జీవించలేకపోతారు. అనవసరమైనవాటిపైనా వృధా ఖర్చులు పెడతారు. దాచుకున్నది చాల తక్కువగా ఉంటుంది. స్త్రీ/ పురుషులు అత్త మామల వద్ద పరువు పోగొట్టు

## ధ్యానము

హస్తాంభోజయుగస్థ కుంభయుగళా దుద్ధృత్యతోయం శిరః సించంతం కరయోర్యుగేన దధతం స్వాంకేన కుంభౌకరే అక్షస్రక్ మృగహస్త మంబుజగతం మూర్ధస్థ చంద్రస్రవ త్పీయూషోన్న తనుం భజే స గిరిజమ్ మృతుంజయం త్ర్యంబకం

## శ్రీ మహా మృత్యుంజయ మంత్రం

ఓం హౌం ఓం జూం సః భూర్భువః స్వః త్రయంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనం ఉర్వారుకమివ బందనాన్ మృత్యోర్ముక్షీయ మామృతాత్ స్వః రోం భూర్భువః జూం సః హౌం ఓం.

# పెళ్లికి పేలాల హోమం



శీఘ్రంగా పెళ్ళి జరగాలనుకొనేవారు ఈ క్రింది మంత్రాన్ని జపించి పేలాల హోమం చేయాలని అంటారు.

**ఓం హుం గ్లౌం గం హరిద్రా గణపతయే వర వరద హ్రీం శీఘ్రం వివాహం మే కారయ కారయ గ్లౌంగం స్వాహా ॥**

ప్రతి రోజు పసుపుతో చేసిన గణపతిని పూజించి, భక్తి శ్రద్ధలతో పై మంత్రమును ప్రతి రోజు 2500 సార్లు 41 రోజులు జపించి, చివరలో పేలాలతో హోమము చేసినచో త్వరగా వివాహము కాగలదని అంటారు.

# కాలసర్ప దోషము వివిధ పరిష్కార మార్గాలు



■ కాలసర్ప యోగం పట్టినవారు, సప్తమ, అష్టమాల్లో రాహు కేతువులు ఉన్న వారు, పూర్వ జన్మలో పాములను చంపినా వారు లేదా మంత్ర తంత్ర విధి విధానాలతో బంధించినవారు, పాముల పుట్టలను త్రవ్వి ఇండ్లు కట్టిన వారు నాగదోషం కలవారై పుడుతారు.

■ కాలసర్ప దోష నివారణకై నాగ పూజ లేదా నాగ ప్రతిష్ఠ చేయవలెను. యథావిధిగా గో, భూ, తిల, హిరణ్యములు దానము ఇవ్వవలెను. దీని వలన దోషము పోయి పుత్ర సంతతి కలిగి కులాభివృద్ధి, సంపత్సమృద్ధి కలుగ కలదు.

■ నాగదోషం తీవ్రమైనది అయితే శుక్ల పౌద్యమినాడు శ్రీకాళహస్తిలో నిద్రచేసి మరుసటి దినం శివదర్శనం చేసుకొని పూజలు జరిపించుట వల్ల నివారణ కలుగగలదు.

■ ఆరు ముఖాల రుద్రాక్షలు చెవులకు లేదా గాజులకు లేదా ఉంగరంగా ధరించుట వలన, ఏనుగు తోక వెంట్రుకలు ఉంగరంగా లేదా చేతికి కడియంగా ధరించుటవల్ల కాల సర్ప దోషము నుండి నివారణ పొందగలరు.

# సంతానబలం కలిగిన గ్రహ పొంతనలు



పంచమాధిపతి, లగ్నాధిపతి శుభు లతో కూడిన కేంద్రములందు వుండి ధనాధిపతి బలము కలిగి ఉంటే పుత్ర సంతానము కలుగును.

లగ్నాధిపతి పంచమ భావములో ఉండి నవమాధిపతి సప్తమ స్థానములో వుండి ద్వితీయ అధిపతి మరియు ధనాధిపతి లగ్నములో ఉంటే పుత్ర సంతానము కలుగును.

నవమములో గురువు, గురునికి కేంద్రమున శుక్రుడు ఉంటే లగ్నాధిపతి బలముగా ఉంటే చాల ఆలస్యముగా సంతానము కలుగును.

పంచమాధిపతి శని అయితే గురు, చంద్ర దృష్టి ఉంటే స్వల్ప సంతానము కలుగును.

పంచమాధిపతి పంచమునందు గులికుడుండి ఆ స్థానాధిపతి పంచమములో ఉంటే కవలలు సంతానము కలుగును.

ద్వితీయ, పంచమాధిపతులకు కుజ, శని సంబంధము ఉంటే సప్తమ స్థానము లందు గురువు ఉంటే స్త్రీ సంతానము కలుగును.

రవిగాని, శని గాని స్త్రీ గ్రహ రాశి అంశాలలో వుండగా బుధ దృష్టి ఉంటే స్త్రీ సంతానము కలుగును.

గురుని నవాంశాధిపతి కేంద్రములలో ఉంటే సంతానము కలుగును.



వలన సంతాన దోషములు, సర్పదోషములు తొలగుతాయని చెబుతారు.

హరివంశ పురాణము పారాయణం చేయుట వలన జాతకములోని సంతాన దోష ఫలితాలు నివారింపబడతాయి. పుత్ర సంతానం కోరుకునే వారికి హరివంశ పారాయణం అత్యుత్తమ మార్గము. శుక్రవారం పిండిలో పన్నీరు కలిపి ఆవుకు తినిపించాలి.

ఒక సోమవారం రాత్రి రెండు పిడికెళ్ళు ముడి బియ్యం నానబెట్టాలి (భార్య నానబెట్టాలి). తరువాతి రోజు (మంగళవారం) భర్త ఆ నానిన బియ్యాన్ని శుభ్రంగా రోటిలో దంచి దానికి సమాంతరంగా బెల్లం కలిపి (దీనినే చలిమిడి ముద్ద అంటారు) ఆ బ్రహ్మ పదార్ధాన్ని సుబ్రహ్మణ్యేశ్వర స్వామి వారి విగ్రహానికి / వెండి పడగకు పూయాలి. తదుపరి ఆ పదార్ధాన్ని భార్యాభర్తలు ఇద్దరు కలిసి తినాలి. ఈ విధంగా 21 వారాలు చేస్తే దోషపరిహారం జరుగగలదని నమ్మకము.



## రాహుకాలము రాహుపూజ

వివాహము కావలసిన వారు శుక్రవారము, సంతానము కావలసిన వారు మంగళవారము రాహుకాలమునందు రాహుపూజ చేయవలెను.

కేతుగ్రహము వరకు సప్త గ్రహాలు ఉంటె అది సవ్య కాలసర్ప యోగము, కేతువు నుండి మొదలు అయి రాహుగ్రహ మధ్యలో సప్త గ్రహాలు ఉంటే అపసవ్య కాలసర్ప యోగము అందురు.

కాలసర్ప దోషం ఉన్నవారికి గ్రహాలు అనుకూలిస్తే ఆర్థికంగానే కాకుండా అన్ని రంగాల్లోనూ అద్భుతంగా ఉంటుంది. ఈ దోషం ఉన్న వారి జాతక చక్రంలో బృహస్పతి (గురు గ్రహం) ఉచ్ఛ స్థానంలో ఉన్నా లేదా రాహువుతో కలిసి ఉన్నా దశ మారి మహోజ్వలంగా ఉంటుంది. ఇలాంటి వ్యక్తులు అత్యుత్తమ ప్రతిభావంతులుగా ఖ్యాతి గడిస్తారు.

## కాలసర్పదోషం - ప్రముఖ వ్యక్తులు







కాలసర్ప దోషంలో జన్మించినా శ్రమను నమ్ముకున్న వారిపై ఈ దోషం ఎలాంటి ప్రభావం చూపదని పండితులు పేర్కొంటున్నారు. ఈ కాల సర్ప దోషంలో జన్మించిన వారిలో జవహర్ లాల్ నెహ్రూ, ధీరుభాయ్ అంబానీ, సచిన్ టెండూల్కర్ లాంటి గొప్ప వ్యక్తులు కూడా ఉన్నారు అంటారు. వీళ్లు తమకు ఇష్టమైన రంగాల్లో అద్భుతంగా రాణించి, కేవలం వ్యక్తిగతంగానే కాకుండా దేశానికి కూడా కీర్తి ప్రతిష్టలు తీసుకొచ్చారు.

# కాలసర్ప దోష మంత్రము




మంత్ర పూర్వం పసుపతి: పాతు

దక్షిణేతు శంకరః

పశ్చిమే పాతు విశ్వేశో

నీలకంఠ స్తదుత్తరే

ఈశాన్యాం  పాతు మీశ్వర:

ఆగ్నేయాం పార్వతీ పతిః

నైరుత్యాం పాతుమే రుద్రః

వాయువ్యాం నీలలోహితః

ఊర్ధ్వే  త్రిలోచనః పాతు అధరాయాం మహేశ్వరః

ఏతాభ్యోదిశ దిగ్భ్యస్తు సర్వతః పాతు శంకరః

# జాతకంలోని కాలసర్ప దోషాల్ని నివారించే సోమావతి అమావాస్య

సోమవారం నాడు వచ్చే అమావాస్యకు హిందూధర్మంలో ఎంతో ప్రాముఖ్యత ఉంది. ఆరోజుని సోమావతి అమావాస్య అంటారు. ఈ రోజు ఉపవాసం చేసి రావి చెట్టుకు 108 ప్రదక్షిణలు చేస్తే జాతకంలో ఉండే సకల దోషాలు, కాలసర్పదోషం పరిహారం కాగలవని అంటారు.

## సోమావతి అమావాస్య కథ



ఒకానొక ఊరిలో ఒక సాధువు ఓ వ్యాపారి కుటుంబాన్ని తరచూ దర్శిస్తూ ఉండేవాడు. ఆయన ఒకనాడు ఆ ఇంటిని దర్శించినప్పుడు

# ఆశ్లేషబలిని ఎలా నిర్వహిస్తారు?



ఆశ్లేషబలి అంటే సర్పజాతికి ఇచ్చే ఒక విధమైన నివేదన. ఈ పూజను ఈ రంగంలో అనుభవజ్ఞులైన పూజారుల పర్యవేక్షణలో నిర్వహించబడుతుంది. ఎవరికైతే తమ జాతకంలో రాహుకేతువుల దృష్టి వలన కష్టాలు పడుతున్నారో వారు ఆశ్లేష బలి పూజకు సిద్ధమౌతారు. ఈ బలి పూజను నిర్వహించే వారు ఆశ్లేషా నక్షత్రం రోజున సర్ప మండలాన్ని వేయాలి. ఇదే ద్వాదశ నాగమండల సర్ప రూప మండలము.



ఇందులో 48 మండలాలు అంటే భాగాలుగా ఉంటాయి. ఈ మండలాలను 48 సర్ప జాతులకు ప్రతిరూపంగా చెబుతారు. ఈ 48 మండలాల్లో బలి ప్రదానం చేయాలి. సర్ప దోషముగల వ్యక్తి ఆశ్లేషా నక్షత్రమునకు సం బంధించి బియ్యముతో స్వయముగా అన్నము

# కాలసర్పదోష నివారణకు ప్రసిద్ధ క్షేత్రం
# హంపిలోని విరూపాక్ష దేవాలయం



హిందూ మతంలో పూజాధి కార్యక్రమాలకు ఎంతో ప్రాధాన్యత ఇస్తారు. ఒంటికి నలతగా అనిపించినా ఇంట్లో పరిస్థితులు అనుకూలంగా లేకపోయినా ఏదో ఒక దేవాలయానికి వెళ్లి ప్రత్యేక పూజా కార్యక్రమాలు నిర్వహించడం సాధారణ విషయం. ఇటువంటి పూజా కార్యక్రమాల్లో కాలసర్పదోష నివారణ పూజలు అత్యంత ముఖ్యమైనవి. ఈ పూజలు జరిపించుకోవడానికి దేశంలో చాలా చోట్ల నుంచి ఆంధ్రప్రదేశ్‌లోని శ్రీకాళహస్తికి లేదా కర్ణాటకలోని దక్షిణ కన్నడ జిల్లాలో ఉన్న కుక్కే సుబ్రహ్మణ్యస్వామి దేవాలయానికి వస్తూ ఉంటారు. ఇందు కోసం కొన్ని నెలల ముందుగానే పూజలు జరిపే రోజును రిజర్వ్ చేసుకుంటున్నారు. మరికొంత మంది తమకు అనుకూలమైన రోజు దొరక్క సదరు పూజాది



తపఃఫలితంగా పరమేశ్వరుడు పంచముఖ నాగలింగేశ్వరు డుగా దర్శనమిచ్చి అయన శోకాన్ని చల్లార్చాడు. ఈ నాగ లింగమును బ్రహ్మదేవుడు కుడా పూజించి సృష్టి కార్యమును విఘ్నంలేక చేయసాగెను. నాగరూప విశేషంచే ఈ క్షేత్రమునకు రాహు కేతు క్షేత్రం అని పేరు వచ్చినది. సర్పదోషములు, రాహు కేతు గ్రహముల దోషం ఉన్నవారు ఈ స్వామిని పూజించితే దోష నివారణ జరుగునని పెద్దల మాట. ఈ ఆలయంలో స్వామి కవచం, నవగ్రహ కవచానికే అలంకారం, ఆరాధనలు చేస్తారు.



శ్రీ అధిదేవతా ప్రత్యధి దేవతా సహిత రాహు-కేతు సర్ప దోషములు ఉన్నవారు రాహు-కేతు స్వరూపులై ఇచట వెలిసిన శ్రీ కాళహస్తీశ్వరులను ఆరా ధించిన దోష నివృత్తి అగును అని తెలుస్తుంది.



**అశ్వని, మృగశిర, ఆర్ద్ర, పునర్వసు, పుష్యమి, ఆశ్లేష, మఖ, పుబ్బ, ఉత్తర, హస్త, మూల, ఉత్తరాషాఢ, ధనిష్ఠ, శతభిషం - ఈ నక్షత్రముల వారు ఏ మాసములోనైనా సూర్యుని పూజించ వచ్చును. అనుష్ఠాన మంత్రాన్ని జపించిన తరు వాత కాలసర్పదోష పరిహా రానికై "శ్రీకంకల సం సర్ప రం రాజాయ నమః" అనే మంత్రాన్ని జపించాలి.**

కొద్ది పాటి బొగ్గులని నీట్లోకి ధార పోయటంవల్ల రాహు గ్రహ దోషం పోతుంది.

పడక గదిలో (నిద్రించే గది) నెమలి ఫించాన్ని కనపడేటట్లు పెట్టి, లేవగానే చూడటం వల్ల రాహు గ్రహ పీడ నెమ్మదిగా నివారణ అవుతుంది.

ఆదివారం రోజున మినప వడలు కాని, మినప ఉండలు కాని పేదలకు, సాధువులకు పంచవలెను.

పై విషయాలు అన్నింటిని చేయుటకు సాధ్యము కానప్పుడు ఇందులో కనీసం కొన్నింటినైనా పాటించినచో రాహు దోషం పరిహారం కాగలదని విజ్ఞుల నమ్మకము.

## త్వరగా పెండ్లి అగుటకు మంత్రం



**ఓం హ్రీం విశ్వావసవే గంధర్వ రాజాయ క్లీం క్లీం మమాభిలషితాం కన్యాం (వరం) ప్రయచ్ఛ ప్రయచ్ఛ క్లీం క్లీం స్వాహా ॥**

భక్తి శ్రద్ధలతో అత్యంత నిష్టగా ఈ మంత్రమును ప్రతిరోజు 1008 సార్లు 21 రోజులు జపించి, భూతతృప్తి చేసినచో త్వరగా వివాహము కాగలదని నమ్మకము. పురుషులు “కన్యాం” అని, స్త్రీలు “వరం” అని జపించవలెను.

# రాహు దోష నివారణా విధానం

నువ్వుల మొక్క ఆకులు, సాంబ్రాణి, కస్తూరి, ఏనుగు దంతం వీటిని నీటిలో వేసి స్నానం చేయాలి.

రాహు గ్రహాన్ని పూజించడం, దుర్గాదేవి ఆరాధన, గోమేధికం ధరించడం వల్ల ఈ గ్రహ దోష నివారణ జరుగుతుంది.

గోమేధికం, గుర్రం, నీలవస్త్రం, కంబళి నూనె, మినుములు, పంచ లోహాలను దానం చేయడం వల్ల కూడా దోష పరిహారమవుతుంది.

గేదె కొమ్ముతో చేసిన పాత్రలో గుగ్గిలం, ఇంగువ, హరిదళం, మనశ్శిలల కలిపిన నీటితో స్నానం చేయాలి.

పంచ లోహ ఉంగరం ధరించడం. శుభతిధి గల శనివారం **'ఓం-భ్రాం-భ్రీం-భ్రౌం-సః రాహవే నమః'** మంత్రాన్ని 40 రోజులలో 18 వేలు జపాలు పూర్తి చేసి, 41వ రోజున మినుములు వస్త్రంలో చుట్టి దానం చేస్తే రాహు గ్రహ సంబంధ దోషం తొలగిపోతుంది అంటారు.



## సుబ్రహ్మణ్య మంత్రం

కాలసర్పదోషం, సర్పగండం నుండి తప్పించుకొనటానికి సుబ్రహ్మణ్య షష్ఠిరోజున ఈ మంత్రాన్ని పఠించండి.

**"ఓం శరవణ భవ"**

**"ఓం కృత్తికా సూనవే నమః"**

**"ఓం అగ్ని గర్భాయ నమః"**

# రాహు మహా దశలో కాలసర్ప యోగము



కాల సర్ప యోగమునకు జ్యోతిష్య సాస్త్రములో ఏడున్నర సంవత్సర ముల శని దశ వలె మహత్వ పూరితమైన స్థానమును ఇవ్వ బడ్డది. ఈ యోగము ఎవరి కుండలిలో అయితే వుండునో వారు రాహు దశలో అష్ట అశ్వర్యములను పొంది ఉన్నతిని పొందెదరు మరియు రాహువు యొక్క అశుభ దశలో దు:ఖములను మరియు కష్టములను పొందెదరు.

కాల సర్ప యోగము ఎవరి కుండలిలో అయితే వుండునో వారిని రాహువు యొక్క మహాదశ ఎలా ప్రభావితము చేయునో పరిశీలిద్దాము రండి.

జ్యోతిష్య శాస్త్రము ప్రకారము రాహువు యొక్క మహాదశ సంఘర్ష పూరితమైనదిగా వుండును. దీని యొక్క మహాదశ నడుచు చున్నప్పుడు జీవితములో త్వరత్వరగా ఒడిదుడుకులు వచ్చును. రాహు దశ యొక్క ఫలితములు త్వరగా లభించుట ప్రారంభమగును. ఎవరి కుండలిలో అయితే కాలసర్ప యోగము ఉండునో వారికి ఈ గ్రహ దశలో విశేషమైన

# కేతు మహర్ధశలో చేయవలసిన దానములు

- కేతు మహర్ధశలో కేతు అంతర్ధశలో ఉమామహేశ్వర దానం చేయవలెను.
- కేతు మహర్ధశలో శుక్ర అంతర్ధశలో దుర్గా దానం చేయవలెను.
- కేతు మహర్ధశలో రవి అంతర్ధశలో భాగ దానం చేయవలెను.
- కేతు మహర్ధశలో చంద్ర అంతర్ధశలో వెండి గుర్రం దానం చేయవలెను.
- కేతు మహర్ధశలో కుజ అంతర్ధశలో నూనె ఘటం దానం చేయవలెను.
- కేతు మహర్ధశలో రాహు అంతర్ధశలో గుమ్మడిపండు దానం చేయవలెను.
- కేతు మహర్ధశలో గురు అంతర్ధశలో తిల దానం చేయవలెను.
- కేతు మహర్ధశలో శని అంతర్ధశలో గేదె దానం చేయవలెను.
- కేతు మహర్ధశలో బుధ అంతర్ధశలో లేడి దానం చేయవలెను.

**గమనిక: కొన్ని వస్తువులు దొరకనప్పుడు వాటికి బదులుగా ధనమిచ్చుట కంటెను ఆ వస్తువు ఆకారంలో వెండితో ప్రతిమ చేయించి దక్షిణతో ఇవ్వవచ్చును.**

## కేతు మంత్రము




శుభతిధి గల మంగళవారము నాటి నుండి ఓం-ప్రాం-ప్రీం-ప్రౌం-సః కేతవే నమః అను మంత్రమును 40 రోజులలో 7 వేలు జపము పూర్తి చేసి 41వ రోజున ఎర్రని వస్త్రములో ఉలవలు పోసి దానమిచ్చినచో కేతు గ్రహ దోష నివారణ కలుగును.

మొదటి, నాలుగు పాదాలలో రాహువు ఉంటే ఆరోగ్యం జాగ్రత్తగా కాపాడుకోవాలి.

రాహువు శతభిషం రెండవ పాదంలో ఉంటే కోపిష్ఠి, మూడవ పాదంలో ఉంటే కాలేయ సమస్యలున్నవారు ఉంటారు.

కేతువు అశ్విని మూడవ పాదంలో ఉంటే ఆరోగ్యం విషయంలో జాగ్రత్త వహించాలి. అలాగే మఖ 1, 2, 3 పాదాలలో ఉన్నా అనారోగ్యం, మూల 1, 2 లో ఉన్నా జాగ్రత్త వహించాలి.

రాహు కేతువులు ఎవరి దశలో ప్రవేశించినా ఆరోగ్యం జాగ్రత్తగా చూసుకోవాలి. వారి దశలలో ముఖ్యంగా గుండె విషయంలోనూ, విష జ్వరాల విషయంలొనూ జాగ్రత్త వహించాలి.

## ధూమ్రవర్ణ గణపతి

**ధూమ్రవర్ణావతారశ్చాభి మానాసుర నాశక:**
**ఆఖువాహన ఏవాసౌ శివాత్మేతి స ఉచ్యతౌ**



ధూమ్రవర్ణ గణపతి మూర్తిని ప్రతిష్టించడం వలన రాహుగ్రహ శాంతికి ఉపయోగపడుతుంది. ముఖద్వారం పై ఈ ప్రతిమ ఉంటే అనిష్ట గ్రహాలను శాంతింపజేసి సుఖవృద్ధికి తోడ్పడుతుంది.

# సర్పసూక్తం - సుబ్రహ్మణ్య సూక్తం

సర్ప దోష లేదా నాగ దోషాల యొక్క ప్రతికూల ప్రభావాలను నిరోధించడానికి లేదా తగ్గించడానికి సర్ప సూక్తం (సుబ్రహ్మణ్య సూక్తం) జపించబడుతుంది. ఇది శ్రీ సుబ్రహ్మణ్య స్వామి లేదా కార్తికేయుడు లేదా మురుగన్ పూజ సమయంలో జపించబడుతుంది. ఇది 3 విభాగాలతో రూపొందించబడింది



నమో అస్తు సర్పేభ్యో యే కే చ పృథివీమను
యే అంతరిక్షే యే దివి తేభ్యః సర్పేభ్యో నమః
యే ఉదో రోచసే దివో యేవా సూర్యస్య రశ్మిషు
యేషామప్సు సదః కృతం తేభ్యః సర్పేభ్యో నమః
యా ఇషవో యాతుధానానాం యే వా వనస్పతీగ్ంరను
యేవా ఉపటేషు శేరతే తేభ్యః సర్పేభ్యో నమః